Registered No. M-4345

# యుద్ధ సంచిక.

సాల్యుం II.] మద్రాసు : 1942 వ సం॥ మార్చి నెల 13 వ తేది శుక్రవారం [నె 10 రు.

## వైస్రాయిగారి విన్నపము.

### "జాతీయ యుద్ధదళమునందు చేరండి."

ఈ నెల పదో తేదిన ఇండియాలో రాజ ప్రతినిధిగారు యీ దిగువ ప్రకటన గావించిరి :—

ఈ దేశంలోనున్న ప్రజలందరికిని అన్ని జాతులు, అన్ని మతాలువారికిని, అన్ని రాజకీయపక్షములవారికిని నేను యీ సందేశము నంపుచున్నాను. జాతీయ యుద్ధ దళమునందు చేరవలెనని కొద్ది వారములలో మీరందరు ఆహ్వానింపబడుదురు. మనమున్న యీ దేశమునకు ప్రమాదం సూచింపబడుచున్నది. మనలో ప్రతి ఒకరును నడుము బిగించి కార్యరంగమున కురకవలసియున్నది. దురాక్రమణకు గడంగిన శత్రువు శాంతంగానున్న దేశాల పైబడి నిర్దాక్షిణ్యంగా రాక్షసకృత్యములొనర్చెను. విభేదములు మరచి ఐకమత్యము కలిగి అట్టి శత్రువును ఎదిరించవలెను. తమ మాతృదేశముయొక్క రక్షణకొరకును, దాని ప్రాచీన వైభవం కాపాడుటకును, భావి ఆశలు కొనసాగించుటకొరకును భారతీయ సిపాయిలు ప్రపంచంలో అనేకభాగములందు ప్రశంసార్హముగా యుద్ధం చేయుచున్నారు.

"నేడు యుద్ధరంగం చాల విస్తరించుచున్నది, మనలో ప్రతివారు సిపాయిలు కావచ్చును. నిలకడగా నుండండి, ధీరులను ప్రోత్సాహించండి, భీరులకు ధయిర్యం చెప్పండి, వాగుడుగాండ్రను మందలించండి, దాగియుండు ద్రోహులను తరిమివేయండి. నేడు దేశరక్షణ దిట్టపరుచండి, రేపు విజయయాత్ర సాగించండి. విజయంలేనిది ప్రపంచంలో విజ్ఞానంగాని, దయగాని, స్వతంత్ర సంస్థలు గాని నిలచియుండవు. చీనా, రష్యా, అమెరికా, బ్రిటను మరి యిరవై రాజ్యాలు మనకు తోడుగా నున్నవి. మహారాజ్యాల అండనున్నాము. ఇండియాలో ప్రతి ఒకరము మన యీ దేశానికి తగినవారమును మన సోదరుల మైత్రికి అర్హులమును అనిపించుకొందుము గాక ; అప్పుడుగాని మన విజయము త్వరగా నిశ్చయంగా చేకూరదు. మీ ధైర్యమును నే విశ్వసించుచున్నాను."

---

## చీనా తిరిగి తలయెత్తును.

(చాంగ్ కాయిషేకు సేనాని.)

ఒక జాతి పునరుద్ధరణ అగుటకు ఎన్నో జరుగవలసియున్నది. అందొకటి, ఆ జాతి ప్రజలు కొంతకాలం లెక్కలేనన్ని కష్టాలు అనుభవించుట.

అన్నింటికన్న ముఖ్యమయినది, ఆ ప్రజలకు తమ జాతీయోద్ధరణయందు సంపూర్ణ విశ్వాసముండవలెను. అట్టి విశ్వాసమున్నచో వారు తమ బాధ్యతను గుర్తించి దాని నిర్వహించుటకు ధైర్యం కలిగియుందురు.

చీనాజాతికి ఐదువేలయేండ్ల ప్రాచీన చరిత్ర విజ్ఞాన సంపదగలదు. ఇపుడా జాతి జపాను దురాక్రమణవలన అణచివేయ బడేటట్లున్నది. ఈ క్లిష్ట సమయమునందు వారి జాతీయాభిమానం ఉప్పొంగినది. కాలంగడచిన కొలది దురాక్రమణ నెదిరించి విజయంపొందాలను స్థిరసంకల్పం వారి కధికమగుచున్నది. ఈ కష్టాలుదాటి చీనా పుటం పెట్టిన బంగారంవలె రాణించగలదు. ప్రతి చైనీయుని దృఢ విశ్వాసమదియే ; ప్రపంచంలోనున్న ప్రతి ఉత్తముని విశ్వాసమదియే.

ప్రాణోపద్రవకరమగు పోరాటంలో దిగినపుడే ప్రాచీన జాతి పునర్జీవనం పొందగలదు. వ్యక్తులకెట్లో జాతికి అట్లే. కష్టంలేనిది సుఖంలేదు.

చర్యలేని కబురులు నిష్ప్రయోజనములు. కష్టాన్ని వీలయినంత తప్పించుకోజూచుట పిరికితనము. తన సంగతి మరచి యితరులను నిందించుట స్వార్థమును దేశాభిమానలేమిని తెలియజేయును.

మన ముందు దారి ముండ్లతో నిండియున్నది. ధైర్యంతో ఓపికతో వాటిని తొలగించినపుడే నూతన చీనా పునరుద్ధరణకు మార్గ మేర్పరుచగలము. అట్టి చీనా ప్రపంచమంతకు మంగళప్రదంగా నుండగలదు.

# చీనా-ప్రజాస్వామ్య ప్రభుత్వము

# గ్రామములందు స్వపరిపాలన

## జపాన్ను నిరోధించగల శక్తికి మూలం స్వయం సహాయం.

చీనా ప్రజలకు తాము ఋణపడియున్నట్లు పాశ్చాత్య ప్రజాస్వామిక ప్రభుత్వములు యీవరకుకన్న యిపుడెక్కువగ గుర్తించినవి. అక్షరాజ్యాలను, ముఖ్యంగా జపాన్ను చీనా ఎందుకింత పట్టుదలతో నిబ్బరంగా నిరోధించగల్గుచున్నది. చీనాలోనున్న శక్తి ఏమిటి? అన్న ప్రశ్నలకు యీ దిగువ వ్యాసంలో జవాబుగలదు :—

అతిపురాతన కాలంనుండికూడా చైనీయులు ప్రజాస్వామ్యం కలిగియున్నవారే. ప్రజలలో చాలమందికి అప్పటి రాజమందిరాలలో ఏమి జరుగుచుండెనో తెలియదు, తెలుసుకొనే యిచ్ఛయుండేది కాదు. అతి విశాలమైన దేశమగుటచే సామాన్య ప్రజలు దూరంగానుండు ముఖ్య పట్నానికి వెళ్ళేవారేకారు. కోట్లకొలదియున్న కార్మికులు, వర్తకులు, పాటకప జనం తమపనేదో తాము చూచుకొనేవారు. తమ గ్రామాలు బాగుంటేచాలు, సామ్రాజ్యకేంద్ర నగరంలో ఏం జరుగుతే మనకేం అని, స్వగ్రామ విషయం శ్రద్ధ వహించుచుండేవారు. కేంద్ర ప్రభుత్వానికి కొంత కట్టుబడి చెల్లించాలని వారెరుగుదురు. అది చెల్లించగానే పై అధికారులు తమ విషయం మరచిపోతారనిగూడా వారెరుంగుదురు.

ఈ అమాయకులు, కష్టపడి పని చేసేవారు. వారికి రాజనీతి, అర్థ శాస్త్రం సాంఘిక లౌకిక మర్యాదలు తెలియక పోవచ్చును, గాని సంఘీభావం బలమని ఎరుంగుదురు. అందుచే సమిష్టి ప్రజాశక్తి నభిలషింతురు. ప్రభుత్వం వచ్చి చేసేవరకు వేచియుండక తమపని తాము చూచుకొనుటకు వందలకొలది ఏండ్లనుండి వారు అలవాటు పడ్డారు. చీనాలో వేలకొలది గ్రామాలలో స్వపరిపాలన గలదు. అట సంఘ సేవా కార్యములన్నియు ప్రజాస్వామ్య ప్రభుత్వ పద్ధతిని జరుగుచుండుట ఆచారమైనది. ప్రభుత్వంవారు యిట్లా చేయాలి, అట్లా చేయాలి అని మార్కెట్టులో అరచుటకు బదులు, చీనావారు తమ ప్రాచీన సంఘములు, వర్తక కూటమి సంఘాలద్వారాను, గ్రామ పెద్దలు దేవాలయ ధర్మకర్తలద్వారాను స్వంత వ్యవహారాలన్ని చక్కబెట్టుకొనుటకు అలవాటు పడియున్నారు.

ఇటువంటి చరిత్ర సాంప్రదాయంగల చీనావారు ఇరువదో శతాబ్దంలో డిక్టేటర్ల పరిపాలనను సహించరు.

నాంకింగు నగరంలో నామ్కేవాస్తే ప్రభుత్వాన్ని స్థాపించిన జపాను ప్రధాని టోజో గారు, చీనా జపానువారి నూతన ఆశియా విధానానికి సహాయంచేస్తున్నదని చెప్పిరి. అది నిజంకాదు. జపానుతో సఖ్యతకుప్పొంగే కొద్దిమంది వ్రేళ్లమీద లెక్కించగల క్విస్లింగులున్నారు. కాని వారి సహాయమనగా ఎంత. నాంకింగులోనున్న తన మిత్రులగు దేశద్రోహులు ప్రతి ఒక్కరికిని అనేక వేలమంది దేశభక్తులగు చీనావారు పగ సాధించుటకు సిద్ధంగానున్నారని జనరలు టోజోగారు తెలుసుకోగలరు. తమ దేశాన్ని ఒకసారి రెండు సార్లుగాక అనేక సార్లు మోసంచేసిన జపానుతో సహకారం వారెన్నడు సహించరు, దాన్ని ద్వేషించి పగ సాధించెదరు.

**క్విస్లింగులు (దేశద్రోహులు) లేరు.**

ఉత్తర చీనాలో నాంకింగునందు తమ చేతికీలుబొమ్మ ప్రభుత్వాన్ని జపాను స్థాపించి, అదియే చీనా జాతీయ ప్రభుత్వమని అంటుంది. చుంగుకింగులోనున్న చాంగ్ కాయిషేకు ప్రభుత్వం చీనాకు పూర్తిగ ప్రాతి నిధ్యం వహించుటలేదనియు, దురాక్రమణపరులగు ఆంగ్లేయులకు ప్రాతినిధ్యం వహించుచున్నదనియు, వారిని తాము ఏషియానుండియే తరిమివేయ దలచితిమనియు జనరలు టోజోగారంటూవుంటారు. కాని నాంకింగు ప్రభుత్వం జపానుకే మాత్రమే ప్రాతినిధ్యం వహించి, జపానుపైనే తన జీవితమునకు ఆధారపడియున్నది. చీనా ప్రజల ప్రాతి నిధ్యం వహించుచున్నదని చెప్పుటకు ఎట్టి నిదర్శనం కనబడదు. జపానుకి అనుకూలం కాని వార్తలను ప్రకటింపకుండా నాంకింగు ప్రభుత్వం కఠిన శిక్షలు విధించును. చీనా వారికి జపానంటే ద్వేషము ఎక్కువై, భయం పోయిందనడానికి ఎన్నో నిదర్శనాలుగలవు.

చీనా ప్రజలు శాంతి ప్రియులయినా, జపాను తమను హింసించుచుండగా, జపాను మిత్రులవైనే వారితో రాజీపడతారా? ఇంతకాలం హింసించుచున్న పొరుగు రాజ్యమగు జపానుతో యిపుడు నాంకింగులో వాంగు చింగువేగారు స్నేహంచేసి రాజ్యం స్థాపించుకొన్నంత మాత్రమున, చీనాకు జపాను మోసం తెలియకుండా వుండునా? ఇపుడు జపాను చీనాతో స్నేహంగావుంటానంటే మాత్రం నమ్మేవారెవరు. గత 11 సంవత్సరాలలో యీ స్నేహం యెట్లు పరిణమించిందో, విశ్వ విద్యాలయాలు, స్కూల్సు, సివిలు ప్రజలు ఎట్లు జపానుచే నాశనం చేయబడినవో చీనా ప్రజ లెరుంగుదురు. చీనా జపాను ప్రభుత్వములకు దురదృష్ట వశమున యింతకాలం ఉండిన అపోహలే యీ ప్రజా పీడకు కారణమని వాంగ్ చింగువిగారంటున్నారు.

**మోసపు స్నేహం.**

జనరలు టోజో జపాను ప్రధాని ఆంగ్లేయుల మైత్రి దురాక్రమణ ఉద్దేశంతోకూడుకొన్నదంటాడు. అయినా దానికన్న తాను చెప్పే "సమానాభివృద్ధి స్నేహం" కాంక్షించదగినదని చీనా వారెవ్వరునమ్మరు. 50 సంవత్సరాల క్రిందట పాశ్చాత్యుల ఆశలు చీనాలో ఎట్లున్నా, చీనాలో ప్రజావిప్లవం జరిగినపిమ్మట జపాను చీనా యెడల శతృత్వం వహించి పాశ్చాత్య దేశాలు స్నేహంగావున్నాయనడానికి సందేహంలేదు. చీనా ప్రజాప్రతినిధి ప్రభుత్వవిధానం అలవరచుకొని త్వరగ అభివృద్ధిచెందాలని పాశ్చాత్య రాజ్యాలుకోరినవి.

చీనా పడిపోవాలని జపాను కోరింది.

జపాను కొరియా, మంచూరియాలందు ప్రజాప్రతినిధుల అభిప్రాయాలు యెంతవరకు మంజూరు చేయబడినవో ప్రజాప్రతినిధి సంస్థలగతి యేమయిందో చీనా ప్రజలకు తెలుసు. "స్వతంత్ర" చీనా యనబడు నాంకింగు ప్రభుత్వంలో భావస్వాతంత్ర్యం యెంతవరకుగలదో కూడ వారికి తెలుసు. నాంకింగు ప్రభుత్వాన్ని జనరలు టోజోగారు తోలుబొమ్మలాడించినట్లు ఆడిస్తారు. అచట అధికారులు చైనీయుల దుస్తులలోనే వున్నా ఖాకీ దుస్తులలోనుండు జపాను సేనాధికారులకు బదులుగా వున్నట్లే వారు చెప్పినట్లే పాలింతురు. చీనా ప్రజలంతా రాజకీయ దురన్యాయమును సైనిక దురాక్రమణను నిరోధించి చీనాకు సిరిసంపద శాంతి చేకూర్చుటకు తోడ్పడనున్న మిత్రమండలి రాజ్యాలతో ఏకమై యున్నారు.

# పసిఫికు యుద్ధం.

## మిత్రమండలి తిరుగుదాడుల ప్రయత్నము.

సంయుక్త రాజ్యాలు చివరకు జపాన్ను అణచివేయగలవను సంపూర్ణ విశ్వాసంతో యిప్పుడెన్ని కష్టాలేనా ఎదుర్కొనగలము. బటేవియా, బాండియాంగు (జావాలోని ముఖ్య నగరాలు) పడిపోయినవి, సౌరబ్యా నౌకా కేంద్రం తగుల పెట్టబడినది, జావాలో నిరోధం నిలిచిపోయింది. ఇతర చోట్ల అక్కడక్కడ మిత్రమండలి సేనలు యింకను యుద్ధం చేయుచున్నమాట నిజమే. సుమత్రా ముఖ్యపట్నమగు మిడాను యింకను డచ్చివారి వశమందేయున్నది. కాని చిరకాలం డచ్చి సేనలు కట్టుదిట్టముగ నిరోధింపజాలవనుట నిజం.

మిత్రమండలికి యీ ఓటమి కలుగుటకు జపానువారి అధిక సంఖ్యాబలమే కాక, క్రొత్త సేనల సహాయం జావాకు సకాలంలో చేరకుండుటయు కారణం. అమెరికానుండి పంపబడిన విమానాలు రానేలేదు, వచ్చినవి కొన్ని భాగాలు సమకూర్చుకొని తిరిగి ఎగిరేలోపున శత్రుబాంబులకు గురైనవి. జావా పతనము సింగపూరు పతనమంత వినాశకరమైనదే కాని మిత్రమండలి కేంద్రాలకు యీ యుద్ధరంగం దూరమగుటయు, సమయానికి అధిక సహాయం చేరలేకుండుటయు గమనింపవలసియున్నది. ఈ ప్రతిబంధకాలు యిప్పుడు రోజురోజుకి తొలగిపోవుచున్నవి. అమెరికా నౌకాదళాధికారులను మార్చివేసిరి. పసిఫికు ప్రాంతాలలో జపాను నౌకాబలం అణచివేయడానికి తగు యేర్పాటులను అధ్యక్షుడు రూజువెల్టుగారు చేసిరి. అమెరికా సహాయం చేరువగుచున్నదని ఆస్ట్రేలియా ధైర్యం చెందవచ్చును.

న్యూగినీలో మూడు చోట్లను జపానువారుదిగి, మార్సుబీ రేవును తీవ్రంగా బాంబులతో కొడుతున్నా, ఆస్ట్రేలియా వైమానికులు జపానువారిని తిరిగి అంత తీవ్రంగా కొడుతున్నారు. ఆస్ట్రేలియా మంత్రులు ఆత్మరక్షణ యుద్ధమే గాక శత్రువుపై తిరుగు దాడిచేసే యేర్పాటులుకూడ చేయుచున్నారు. అమెరికా - ఆస్ట్రేలియాలు సమిష్టి యుద్ధ విధానం తయారుచేసి అమెరికా ఇంగ్లాండు ప్రభుత్వముల ఆమోదము సహాయము కోరుచు పంపినవి.

### వావెల్ గారు—ఇండియా రక్షణ.

శత్రువుపై ఇండియానుండి కూడ తిరుగుదాడి జరుపుటకు జనరలు వావెలుగారు ఏర్పాటులు చేయుచున్నారు. అందుకని వారు లాషియోలో చీనా సేనాని జనరలు చాంగ్ కాయి షేకుగారితో సంప్రదించిరి. దాని ఫలితంగా రంగూననుండి బ్రిటిషు సేనలు విరమించి చీనాకుపోవు బర్మా రోడు రక్షణయందు చీనా సేనలకు తోడ్పడుచున్నవి. రంగూనునుండి తీసుకపోజాలని రేవుకట్టడములు, యంత్రములు, చమురు పరిశుభ్రపరచు కర్మాగారాలు శత్రువుకి చిక్కకుండ కాల్చివేయబడినవి. బర్మా యుద్ధమునందు అమెరికా వాలంటీరు గ్రూపు వైమానికులు చాల ప్రతిభావంతముగ పోరి భారతీయ, బ్రిటిషు విమానదళములతో కలసి శత్రువుకన్న అధికుల మనిపించుకొనిరి. తమవారిలో ఒకరు పోతే శత్రువులలో 8 గురిని చంపిరి. బర్మాలో జనరలు సర్ హెరాల్డు అలెగ్జాండరు గారు (జి.ఓ.సి.) సేనాధిపతిగ నియమింపబడిరి. వారు బ్రిటనులో సేనాధికారిగా నుండిరి. గత యుద్ధంలో పేర్గాంచిరి. వారు ఇటుక కట్టడముల వెనుక దాగొని యుద్ధం చేయుటతో సంతృప్తిచెందక, అకస్మాతుగ శత్రువుపైబడి తిరుగు దెబ్బకొట్టే విధానమునందు నమ్మకంగలవారు.

ఇట్టి నాయకుడు సైనికవ్యూహములు పన్నుటకుండుటచే మార్షలు చాంగ్ కాయి షేకు నాయకత్వమున చీనా సేనల సహాయంతో జనరలు వావెలుగారు జపానువారిని బర్మానుండి తరిమివేయదలంచుచున్నారు. ఎట్లయినా తిరుగు దాడి జరుపుటకు మిత్రమండలికి అధికబలం చేకూరేవరకు వారిని ఇండియాకు దూరంగా నుంచగలడు.

---

# వసంత ఋతువు-యుద్ధ సన్నాహాలు.

## రష్యా, జర్మనీ ఆయుధ సైనిక సంపద వ్యత్యాసములు.

## ఇండియా రక్షణకు బ్రిటీషు ప్రభుత్వ సహాయం.

## రంగూనుపోతే బర్మా పోయినట్లెంచరాదు.

వసంత ఋతువులో ఎవరు ముందంజవేస్తారో తెలియదు. కాని మహాయుద్ధం జరుగనున్నది.

**జర్మనీ విదేశాలపై నాధారపడియుంది.**

జరుగనున్న యీ మహాయుద్ధంలో మిత్రమండలి విజయం పొంది హిందూమహాసముద్రం, పెర్షియను గల్ఫు, ఎర్ర సముద్రములందు ఆధిపత్యం చెక్కుచెదరకుండా నిలుపుకొనును.

ఈ యుద్ధానికి తయారగుటకు మూడు ముఖ్యాధారము లుండవలెను. సైన్యానికి కావలసినంత మంది యువకులుండాలి. పరిశ్రమలు నడిపించుటకు మనుష్యులుండాలి. ఆయుధ సంపద యుండాలి. టాంకులు, ఆయుధాలు యంత్రాలన్ను జర్మనీ ప్రతిదినం అనేకం గోల్పోవుచున్నది అయినను జర్మనీ ఉత్పత్తి శక్తికి, జకోస్లావోకియా, ఫ్రాంసు, బెల్జియ, ఇటలీల సంపదకలసినందున హిట్లరు కావలసినన్ని ఆయుధాలు తయారుచేసుకోగలడు. కావున మిత్రమండలికే యెక్కువ అనుకూలంగా వుందనుకోరాదు.

జర్మనీ సైన్యాలలో చేరుటకు యువకులుగూడా తక్కువవరు. జర్మను సైన్యంలో 290 డివిజను లుండవచ్చును. కాని 1941 వ సంవత్సరం జర్మను సైన్యం ఉన్నంత శక్తివంతంగా ఉత్సాహవంతంగా 1942 వ సంవత్సరం జర్మను సైన్య ముండజాలదు. మంచి యువక సైన్యమంతా చనిపోయింది. వారిస్థానే క్రొత్తవారు, అంతకన్న బలం తక్కువవారిపై హిట్లరు నాధారపడియుండును. జర్మను ఫాక్టరీలలో 17 సం॥ల వయస్సుగల బాలురందరిని నిర్బంధంగా నియమించుచున్నారు. ఈ చిన్నవయస్కుల పని గత యుద్ధంలో సంతృప్తికరంగా లేకుండెను.

జర్మనీకి సహాయంచేయుచున్న రుమేనియను సైనికులు 200,000 మంది క్రిమియా, ఒడెస్సా యుద్ధాలయందు చనిపోయినందున, యింకా ఎక్కువమందిని పంపమని హిట్లరు కోరగా హంగరీనుండి తెచ్చుకోమని రుమేనియా అంటున్నది. హంగరీనుండి 5 లక్షల సైన్యాన్ని పంపించాలి. లేకుంటే ట్రాంసిల్వేనియాలో హంగేరీకి ఉన్న సౌకర్యా,

లు తొలగిస్తానని హిట్లరు బెదిరిస్తున్నాడు, కాని హంగేరీ లొంగలేదు.

బల్గేరియనులుకూడ అతనికి నమ్మదగ్గ మిత్రులుగ లేరు. ఆ దేశంలో ప్రజలు రష్యను విజయమునే ఆశించుచున్నారు. రష్యా తిరుగుదాడి ఎక్కువ ముందుకు సాగుచున్నకొలది యీ ఆశ ఎక్కువగుచున్నది.

సైన్యానికి యువకులు అర్హులు తగినంతమంది దొరుకుట కష్టమయినట్లే, యుద్ధపరిశ్రమల తయారుకి జనం లభించకుండా వున్నారు. చాలకాలంనుంచి స్త్రీలనే యీ పనికి నియమించుచున్నారు. పొలాలలో పని చేయుటకు 1,80,000 బాలబాలికలను చేర్చుకొన్నట్లు బెర్లినులో ప్రకటించబడెను. 14 సంవత్సరముల పసిబాలురు వ్యవసాయపు నాగలి యంత్రాలు నడుపుచున్నారు. జనం చాలక 27 యితర దేశాలనుండి పేరుకి స్వతంత్ర కాంట్రాక్టుపద్ధతిని కూలి జనాన్ని తెచ్చుటకు జర్మనుమంత్రి పూనుకొనెను. ఆ దేశాలు మంచిగా ఒప్పుకోకపోతే భయపెట్టి నిర్బంధిస్తారు. నార్వేలో క్విస్లింగు ప్రభుత్వం 5,000 మందిని పంపుటకు అంగీకరించినది. క్విస్లింగు ప్రధాని కార్మికులను బలవంతం చేసి విదేశాలకు పంపుట కంగీకరించెను. జకోస్లావోకియాలో నొక నగరమునందు 13—16 సం॥ల లోపు స్కూలు పిల్లలు జర్మనీకి పంపబడిరి. హాలెండులో నున్న నిరుద్యోగులు 1,84,000 జర్మనీకి పంపబడనున్నారు. ఇటలీవారికి జర్మనులంటే నిజంగా యిష్టంలేదు. అయినా 3,00,000 ఇటలీ కార్మికులను తెప్పించుటకు జనరలు గోరింగు గత మాసంలో బేరమాడెను. బెల్జియంలో 6,00,000 మంది కార్మికులు జర్మనీకి పోకపోతే వారికి తిండి లేకుండా చేస్తామని అధికారులు ప్రకటించిరి. బలవంతం చేస్తే వెళ్లకేమి చేస్తారు. కాని వాళ్లు సరిగా పనిచేస్తారా?

మొత్తంపై చూస్తే జర్మనుసైన్యం విశేషంగా తమ స్వంత జనంచేత పెంచుటకు వీలులేక పొరుగు రాజ్యములనుండి రప్పించబడిన వారిచేత పెంచుచున్నారు. వారి పరిశ్రమలన్నియు స్త్రీలపైని, పసిబాలుర సేవపైని, విదేశాలనుండి నిర్బంధంగా వచ్చిన కార్మికులపైని ఆధారపడియున్నవనవచ్చును.

**రష్యా శక్తి సంపద**

దీనితో పోల్చిచూసిన రష్యా శక్తి సంపద ఎంతో మేలనిపిస్తుంది వారు సైన్యాన్ని కార్మికులను సేకరించు పద్ధతివేరు. రష్యాకు 1,930 లక్షల స్వంతజనం గలరు. వారు జర్మను యుద్ధయత్నాలను ధ్వంసంచేయాలని స్థిర సంకల్పం కలిగియున్నారు. వారి ఎర్రసైన్యం గత ఆరు నెలలాయి తీవ్రంగా యుద్ధంలో తగుల్కొనియున్నా, ఆకాలంలో వారి ఫాక్టరీలలో ఉత్పత్తి తగ్గిపోయినా, రష్యా ప్రభుత్వం అధిక సైన్యాన్ని కార్మికబలాన్ని తన స్వదేశంనుండే తెప్పించుకొనగలదుకాని, యితర దేశాలపై నాధారపడనక్కరలేదు. వారి సప్లైకి లోటులేదు. అగాధమగు సముద్రంనుండి నీరుతోడినట్లు తోడగలరు.

నానాటికి వృద్ధి పొందుచున్న ఎర్ర సైన్యమునకు ఆయుధసామగ్రి సరఫరాచేయుటకు క్రొత్త కర్మాగారములు విశాలమగు రష్యాదేశమందంతటా సృష్టింపబడుచున్నవి. యుద్ధరంగాలకు క్రొత్తసైనిక డివిజనులు పూర్తిగ ఆయుధసామగ్రితో వచ్చి చేరుచున్నవి. యింకను క్రొత్తవి వసంతఋతువు యుద్ధానికి తయారగుచున్నవి.

సైన్యంలో యింతమంది చేరుచున్నా, క్రొత్తకర్మాగారాలకు పనివారు చాలకపోలేదు. దానికి తగిన యేర్పాటు సోవియటు ప్రభుత్వం ముందుగనే చేసుకుంది. సోవియటు ఉన్నతాధికారుల ఉత్తరువు ప్రకారం పట్టణాలలోనున్న కాయపుష్టిగల జనులందరు యుద్ధోత్పత్తికి పనిచేయ శాసింపబడిరి. పరిశ్రమల పాఠశాలలందు శిక్షణపొందవలసినవారు, హైస్కూలు విద్యార్థులు, 8 సం॥లలోపు వయస్సుగల బిడ్డలున్న తల్లులు తప్ప తక్కినవారందరు 16-55 సం॥ల పురుషులు, 16-45 సం॥ల స్త్రీలు పనులుచేయ నిర్బంధించబడిరి. తెలివైన రష్యా ప్రభుత్వము, పగ సాధించాలను పట్టుదలతోనున్న విశేష జనసంఖ్య సహాయం కలదగుటచే, తమ ఎర్రసైన్యం ఎంత ఎక్కువగా పెరిగినా దానికి సామగ్రి లోటులేకుండా తగు ఏర్పాటులు చేసింది.

ఈరీతిగా రష్యాసైన్యం పరిశ్రమలు దేశాభిమానంతో పట్టుదలతోకూడిన స్వదేశీయుల సంఘీభావబలంతో కూడియుండగ, జర్మనుసైన్యం ఆక్రమింపబడిన బానిసరాజ్యాల నిర్బంధసేవపై నాధారపడియున్నది.

**ఇండియా రక్షణకు బ్రిటను సహాయం**

ఇండియా ప్రభుత్వం ఆయవ్యయపట్టిక ఆర్థిక సభ్యుడగు సర్ జరామీ రైజుమనుగారు ప్రకటించినపుడు ఇండియా రొక్క ఆర్థిక సుస్థిరత బయల్పడుటయేగాక, అందుకు ఇంగ్లాండు ఎంతవరకు తోడ్పడుచున్నదో తెలియుచున్నది. నడచుచున్న వత్సరమునందు రూ 300 కోట్లు ఇండియాదేశ రక్షణకు వెచ్చింపబడుచున్నవి. అందులో మూడోవంతు బ్రిటిషు ప్రభుత్వంవారు భరించుచున్నారు వచ్చేయేడు దేశరక్షణ వ్యయం రూ 533 కోట్లు అగునని అంచనావేయబడినది. అందు ఇండియా రూ 133 కోట్లే భరించును, ఇంగ్లాండు రూ 400 కోట్లు భరించును. దినానికి రూ 130 లక్షల సవరలు యుద్ధంకొరకు ఖర్చుచేయుచున్న దేశం, మనయుద్ధవ్యయంలో యింత యెక్కువ భాగం తాను తీసుకొనుచున్నది. ఇంగ్లాండు యుద్ధం కొరకు ఇండియా పీడింపబడుచున్నదను శత్రువుల దుష్ప్రచారము అసత్యమని దీనివలన తెలియగలదు.

ఇక జర్మనీ జపానుల సంగతి చూడండి: బెల్జియంలో జర్మను మార్కు నాణెమునకు 12½ బెల్జియం ఫ్రాంకులు విలువ నిరంకుశంగా నిర్ణయింపబడినది. జర్మను సోల్జరుల కొనుగోలు శక్తి నూటికి నూరు ఎక్కువ చేయుటకే యిట్లు చేయబడినది. తమ దేశంలో జర్మను సైన్యాలను ఉంచుకొనుటకు బెల్జియం ప్రభుత్వం, తన సైన్యానికంతకు ఖర్చుచేయుచున్నదానికన్న ఆరురెట్లు ఎక్కువ జర్మనీకి చెల్లించుచున్నది.

గ్రీసులో జర్మనులదోపిడి నమ్మడానికి వీలులేనంత విపరీతంగాయుంది. మార్కు కాగితంనోటులు లెక్కలేనన్ని అచ్చువేసి, ఒక మార్కునకు 50 డ్రాక్మాసు విలువ నిర్ణయించిరి. ఈమారకంరేటును అంగీకరించనివారు జైలులలో నుంచబడుచున్నారు. ఆ నోట్లు అచ్చువేయుటకు కాగితం సిరా ఉన్నంతకాలం జరుగుచుండును. రెండు జర్మను సైన్యపులారీలు యీ నోట్ల ముద్రణంచేయుచు, జర్మను సిపాయిలకు నోట్లు పంచుకొనుచూ పోతూ వుంటాయి.

మలయా, ఫిలిప్పైను దీవులందు జపాను అధికారులు కూడ యిట్లే చేయుచున్నారు. జపాను స్నేహంచేసిన తాయిలాండుకిగూడ యింతే శాస్తి జరిగెను. 400 లక్షల బహట్లు (తాయి నాణెము) టోకియోనుండి బంగారం పంపిస్తామని జపానువారు తీసుకొనిరి. కాని ఆ బంగారం టోకియోనుంచి ఎప్పటికీ రానేలేదు. జపానువారియన్ను నాణెమునకు అంతర్జాతీయ మారకం విలువలేనందున, తాయిలాండు నాణెములను జపాను తీసుకుంది. ఆదిని భయపడి, తాయిలాండు జపాను చెంతచేరినందుకు బాగుగ బహూకరింపబడినది.

# భారతీయ సిపాయి.



ఇరానులో ప్రపంచంలోకల్లా పెద్దదగు చమురుగనిని కాపాడుటకు మరఫిరంగిని ప్రేల్చుటకు సిద్ధముగ నున్నాడు.

---

**ఇండియా సైన్యం.** లండను ప్రభువుల సభలో ఫిబ్రవరి 24 వ తేదిన క్రానుబర్ను ప్రభువుగారు ఇండియా యొక్క సైనిక శక్తిగూర్చి పలికిరి. వారి మాటలు సందర్భశుద్ధిలేకుండ విడదీసి చూస్తే తప్పు అర్థం కలుగ వచ్చును. ఇండియాలో నున్న సాయుధ సైన్యములన్నిటిని, యింతకన్న మంచి పనికి వినియోగించవలెనని ఎవరో సూచింపగ "పూర్తిగ ఆయుధాలుగల ప్రతివాడు ఉపయోగింపబడుచున్నాడు" అని క్రానుబర్నుగారు చెప్పిరి. దుష్టులు కొందరు, యీ వాక్యానికి వేదార్థం చెప్పి, ఇండియా సైన్యం అంతా విదేశాలందే యున్నది, ఇండియాకు రక్షణ లేదనియు వ్యాఖ్యానం చేయవచ్చును.

ఇది చాల అసందర్భమగు వ్యాఖ్యానం. అక్షరాజ్యాల సైన్యాలు ఇండియా నేలలో కాలుపెట్టకుండ చేయుటకు, పశ్చిమ ప్రాంతములందు బర్మాయందు, ఆఫ్రికా ప్రాంతములందు భారతీయసేనలు యుద్ధం చేయుచుండుట నిజమే. ఇండియా సరిహద్దులకు వెలుపలనున్న రక్షణ శిబిరములవి. అయినను, ముఖ్యంగా చెప్పేదేమంటే, ఇండియా సరిహద్దులలో కావలాస్థలములందున్న సైన్యాలు విదేశాలకు పంపబడినవాటికన్న చాల ఎక్కువైనవి. వారికి పూర్తిగ ఆయుధ మోటారు యంత్రసామగ్రి లేక పోయినను, ఆయుధాలు లేక పోలేదు.

**రంగూను పడిపోతే.** రంగూను పడిపోయిందంటే ఎంతో నష్టం కాదని చెప్పడం బూటకంగానే వుంటుంది. కాని రంగూను అంటే బర్మా అంతా కాదు, బర్మా పూర్తిగ విడువబడలేదు. మన సేనలును చీనా సేనలును ఉత్తరాన శత్రువునకు బాగా బుద్ధి చెప్పగలవు. చీనా సేన ఎక్కువ భాగం యిప్పుడు షాను సంస్థానములందున్నది. అవి యిప్పుడు థాయిలాండుపైబడి బర్మాలోనికి వచ్చుచున్న జపాను సేనలకు వెనుకభాగంనుండి కొట్టగలవు. అట్టి అవకాశం యివ్వకుండుటకై జపాను సేనలు యీ ఉత్తర రంగమున అతి జాగ్రత్తగ ముందుకు సాగుచున్నవిగాని తొందరపడలేదు. చీనా సేనలు చీనాలో జపాను సేనలతో గొరిల్లా యుద్ధం చేసిన అనుభవం బాగా కలిగియున్నవి. జపాను సేనలు చాల ముందుకువచ్చి మార్గాలు పొడిగించుకొన్నచో ఏమాత్రం లోపం వున్నా చీనా సేనలు అడ్డం కొట్టి లాభం పొందగలవు. ఈ ప్రమాదాన్ని జపాను గుర్తించినట్లుంది.

**తమ తప్పు లెరుగరు.** జర్మనీ జపానులు ఎన్ని చెప్పినా లోపాలు లేనివారుండరు. చర్చిలుగారు యీ సత్యం తెలిసినవారగుటచే, తరుచు తమ తప్పులు అంగీకరించి, వాటికి పూర్తి బాధ్యత తామే వహించి, యింకా ఎక్కువ కష్టాలు రాగలవని సూచిస్తూ వుంటారు. అందుకు బ్రిటిషు పార్లమెంటులో వారి చర్యలు విమర్శింపబడుచున్నా, కష్టకాలమునందు బ్రిటిషు ప్రజల పట్టుదల శక్తి అధికమగునే కాని తగ్గవు.

సత్యం గుర్తించి తమలోపాలు తెలుసుకొనే యీ గుణానికీ, జర్మనీ జపానులందున్న గుడ్డివీరపూజకు వ్యత్యాసం చూడండి. "చక్రవర్తి పుణ్యంవల్లనే మన సేనలు అన్ని రంగాలలో జయించుచున్నవి" అని జపాను ప్రభుత్వం ప్రకటించెను. అయితే యీ చక్రవర్తి పుణ్యంవలన 1940 లో బ్రిటను తీరిక లేక ఒంటరిగా యుద్ధం చేయుచున్నపుడు అమెరికా యింకా మేలుకోకముందు జపాను యెందుకు యుద్ధంలో దిగి గెలువలేకపోయింది. డంకిర్కు యుద్ధం తదనంతరం జర్మనీ ఎన్ని పొరబాటులు చేయలేదు? గత జూను మాసంలో కన్నుగానక రష్యాపై హిట్లరు దాడి ప్రారంభించుట, ఇంగ్లాండు చేసిన పొరబాటులన్నింటిని మరిపింప జేయును.

అయితే, శత్రువులు పొరబాటులే చేస్తువుండాలని సంయుక్తరాజ్యములు కోరుటలేదు. తప్పులేనివారు లేరని వారెరుంగుదురు. యుద్ధవీరులను ప్రభువులను దేవునివలె పూజించుటపై తమ విజయం ఆధారపడియుండదనియు, గట్టి కృషిపై నాధారపడియుండుననియు వారెరుంగుదురు

# ఏమిటి కర్తవ్యం?

యుద్ధం మంచిరసకందాయమైన కథ పట్టులోకి వస్తోంది. బర్మాలోకి శత్రుసేనలు బాగా ప్రవేశించి హోరాహోరిగా పోరాటం సాగించాయి. రంగం యుద్ధరంగం అయింది. ఇది ఒక పెద్ద కథారంగం-రంగూను ఖాళీచేసి బ్రిటిష్ సేనలు వెళ్లినమాట వాస్తవమే. కాని ఈరంగంతో ఆగిపోయేదికాదు యీ యుద్ధతరంగం. బ్రిటిష్ బలం అంతటితో భంగంకాదు. బర్మాలోకి వచ్చినతర్వాతనే వాడి బడాయి బయటపడుతున్నది. జపానువాళ్లు యుద్ధం ప్రకటించినది మొదలుగా యింతవరకు బర్మాలో 250 జపాను విమానములు ధ్వంసమైనాయి. ఇవిగాక అనేక జపాను విమానాలు తిరిగి తమ విమానాశ్రయములకు చేరలేక చెడిపోయినవి. ఇది చాలా పెద్దదెబ్బ. బర్మాలో జరిగే యుద్ధంలో ఇంకొక్క ముఖ్యవిషయం ఏమిటంటే, చైనాసేనలువచ్చి బర్మాలో మొండిపట్టుదలతో శత్రువును ఎదిరించి పోరాడుతున్నవి. ఈ బర్మాయుద్ధరంగంలోనే బ్రిటిష్‌సేనలు టాంకులను (ఫిరంగి మోటారులను) విశేషంగా ప్రయోగించి శత్రుసేనలను సంహరించేస్తున్నాయి. బర్మాలోకి జపానుసేనలు ప్రవేశించినతర్వాత మూడు విధాలుగా కష్టనష్టాలు పడుతున్నారు. బర్మాలో వారికికలిగే విమాననష్టమా! అపారము. వారిని అక్కడ ఎదిరించుచున్న చైనాసేనలా! చెక్కుచెదరని ఉక్కుముక్కలు-బ్రిటిష్‌సేనలు రణరంగంలోకి తీసికొనివచ్చిన ఫిరంగి మోటారులా, చండప్రచండంగా శత్రుసేనలపై అగ్నివర్షం కురిపించి ఆహుతిచేస్తున్నాయి. విమాననష్టం, చైనాసేనల శౌర్యం, బ్రిటిష్ టాంకుల అగ్నివర్షం—యీ మూడు విధాలుగా జపానుసేనలు అక్కడ మూడు చెరువుల నీళ్లు తాగుతున్నాయి. ముందంజవేయడానికి ముప్పతిప్పలు పడుతున్నాయి—తడిసి ముప్పందుమవుతున్నాయి.

బర్మానుంచి చైనాకు పోయేరోడ్డును పట్టుకొని, బర్మానుంచి చైనాకు ఆయుధసామగ్రులుగాని, ఆహారసామగ్రులుగాని పోకుండా అడ్డగించవలెనని జపానువారు విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. కాని, ఆ బర్మా-చైనా రోడ్డుయొక్క ఉత్తరభాగం చెక్కుచెదరకుండానే ఉంది. లాషియోనుండి కున్మింగువరకు ఆ రోడ్డు నిరాఘాటంగా నిర్భయంగానే ఉంది. పోనీ, ఒకవేళ ఆ రస్తామీదకే శత్రువులు వస్తారన్నప్పటికీ, మరొకరోడ్డు ఇండియాలోని అస్సాముగుండా చైనాకు సిద్ధమైంది. ఇండియానుంచి చైనాకు కావలసిన సామగ్రులన్నీ యీ క్రొత్తరోడ్డుమీదుగా పంపించుటకు ఏర్పాట్లు చేస్తున్నారు. ఒకటిన్నరకోటి రూపాయిల సరకును ఇండియానుంచి చైనాకు సప్లయిచేయవలసినదని చైనా ప్రభుత్వమువారు మన ఢిల్లీ ప్రభుత్వానికి ఆర్డరు కూడా యిచ్చారు. కొన్నికోట్ల గజాల గుడ్డను పంపించవలసినదని ఆర్డరుయిచ్చారు. ఇండియా గవర్నమెంటు తాలూకు సప్లయి డిపార్టుమెంటువారు యీ సరకు సప్లయిచేయుటకు పూనుకొన్నారు. చైనాకు కావలసిన సామగ్రులను చైనాప్రభుత్వం కొనుక్కొనగల్గుటకై ఇటీవల అమెరికా ప్రభుత్వమువారు చైనాకు 50 కోట్ల డాలరులను అప్పుగా మంజూరుచేసినారు. అనగా 175 కోట్ల రూపాయిల మొత్తమును మంజూరుచేసినారు. ఈ సరకు సామగ్రులను సప్లయిచేయుటకు ఇండియా ప్రభుత్వం బేరం ఒప్పుకున్నది—చైనాకు యీ సరకు సామగ్రులను రవాణాచేయుటకు వీలైన కొత్త రస్తానుకూడా తయారుచేసింది. కనుక, బర్మా-చైనా రోడ్డును జపానువాళ్లు పట్టుకుంటే వచ్చిన నష్టమేమిటి? బర్మా-చైనా రోడ్డుపోతే, దాని తాతలాంటి అస్సాం-చైనారోడ్డు తయారైంది. ఇదంతా జపానువాళ్లకు ఇంద్రజాల తంత్రంగాఉంది. కాలికివేసిన ముడి వేలికీ; వేలికివేసినముడి కాలికి అన్నట్లయింది.

ఇంతకూ, బర్మా-చైనారోడ్డును బంధించవలెననే పట్టుదల జపానువాళ్లకు ఎందుకు కలిగిందో మూలకారణం విచారించాలి. చైనాలో జపాను సేనలు నాలుగున్నర సంవత్సరాల నుంచి యుద్ధంచేస్తున్నప్పటికీ, చైనాను జయించడం వాళ్ల తరమగుటలేదు. కొబ్బరికాయలోని కొబ్బరిఅంతా తినవలెనని పూర్వం ఒక కోతి ఆ కొబ్బరికాయకొక పెద్ద రంధ్రంచేసి, ఆ కొబ్బరికాయలోనే తలదూర్చింది. కాని, ఆ టెంకాయలో దూర్చిన తలకాయ ఎంత అవస్థపడినా ఊడిరాలేదు. టెంకాయలోఉన్న కొబ్బరిని తినవలెననే ఆశకూడా వదలలేదు. చైనాలో ప్రవేశించిన జపానుసేనలకు అటువంటి దుర్గతిపట్టింది. ఈరోజువరకూ, జపానుసేనలు అక్కడ వేలకొలదిగా ప్రతివారమూ, ప్రతిమాసమూ నాశనమవుతున్నాయి. క్రిందటివారం చైనాలో షాంటుంగు పరగణాలోని దక్షిణభాగంలో 5 వేల మంది జపాను సైనికులు హతులైనారని విన్నమొన్నటి వార్తలవల్ల తెలిసింది—హూపే పరగణాలోని మధ్యప్రాంతంలోను షాన్సీ పరగణాలోని నైరృతిప్రాంతంలోనుకూడా తీవ్రపోరాటం జరుగుతోంది. ఈ విధంగా చైనాలో జపాను సేనలు నాశనం అగుటకు రెండు మూడు ముఖ్య కారణాలు ఉన్నాయి. అన్నిటికన్నా పెద్ద కారణం, చైనావారి మొండి పట్టుదల-రెండో ముఖ్యకారణం, చైనాకు బ్రిటిష్‌వారున్నూ అమెరికావారున్నూ అపారంగా ఆయుధ సామగ్రులను ఆహార సామగ్రులను సప్లయిచెయ్యడం మూడో కారణం చైనాదేశం విస్తారమైన అలవికాని రాజ్యం. 45 కోట్ల జనసంఖ్యగల రాజ్యం. ఈ జన్మలో జపానువాళ్లు దాన్ని జయించలేరు. కాబట్టి యీ చైనా కొబ్బరికాయలో జపాను దూర్చిన తలకాయను దూర్చినట్లే ఉంచాలి. చైనాతో యుద్ధం సాగుతూనే ఉండాలి. చైనావాళ్లు యుద్ధం సాగిస్తూనే ఉండాలి. చైనావాళ్లు యుద్ధం సాగిస్తూ ఉండేటందుకు మనము చైనాకు సామగ్రులు వగైరా సప్లయిచేస్తూ, చైనాకు నిరంతర సహాయంచేస్తూ ఉండాలి. కాబట్టి నేడు కాకపోతే రేపయినా జపానుకు అంత్యకాలం చైనాలో తప్పదు. ఈ రహస్యం మనము గ్రహించాలి. చైనాతో భారతీయులు ఏక కుటుంబీకులు కలిసి సమష్టి పోరాటం శత్రువుతో సాగించాలి. చైనా ఓడిపోవడం భారతదేశానికి ప్రమాదం. భారతదేశం శత్రువులపాలైతే చైనాకూడా యిక్కట్టుల పాలవుతుంది. కాబట్టి చైనాకు భారతదేశానికి ఒకవిధమైన పరస్పరాశ్రయ సంబంధం ఏర్పడింది. కనుక, చైనాలోని జపాను సేనలకు పూర్తిగా పని కల్పించాలి. జపాను సేనలకు అక్కడ భరతంపట్టించాలి. అందుకోసం భారతీయులు చైనాకు చేయూతయివ్వాలి. ఇదే మనకర్తవ్యం.

అయితే, చైనాకూ జయ్! అనికేకవేసినప్పుడే భారతమాతకు జయ్! అనే మాటకూడా అనాలి. "నా దేశంబిది; నా జన్మ హక్కు యిది" అనే వీరావేశంతో ప్రతిభారతీయుడూ భావించాలి. శత్రువులకిది ధర్మసత్రము కాదు అని ఋజువుచెయ్యాలి. మన ఆగ్రహమంతా ఆ గ్రహాలమీద చూపించాలి. వాళ్లకు యిక్కడ త్రాగడానికి గంగయినా దొరకకుండా వాళ్లను గంగపాలు చెయ్యాలి. కత్తిఉంటేనే మనశక్తి చూపగలమనేమాట వట్టిమాట. విరోధిని సాధించవలెనంటే వెయ్యివిధాలున్నాయి. మన దేశ స్వాతంత్ర్యం మనకు కావలెనంటే మన సంకల్పబలం మనం చూపించాలి. ఒక విషయం ఆలోచించండి. శత్రువులు దేనిని గెలువవలెనని

వస్తున్నారు? రాజ్యం గెలువవలెనని వస్తున్నారా? ప్రజలను గెలువవలెనని వస్తున్నారా? అందాకా ఎందుకు? ఎక్కడైనా, ఏ గ్రామంలోనైనా, రైతుతో తగాదా వస్తుందా? భూమితో తగాదా వస్తుందా? రైతు మనవాడైతేనేగాని, భూమి మనదికాదు. పొలాలైనా అంతే, రాజ్యాలైనా అంతే. అందుకనే ప్రతి గ్రామములోను ఊరుకాపు సంఘాలు ఏర్పడాలి. శత్రువులవల్ల అపాయాలు ప్రజలకు కలుగకుండా కొన్ని కాపుదల ఏర్పాట్లు చెయ్యడమే యీ ఊరుకాపు సంఘముల ముఖ్య కర్తవ్యం. అంతేకాదు, ఏ గ్రామంమీదకు శత్రువులు వచ్చినా, ఆ గ్రామవాసులందరూ, ఆ గ్రామంలోని ఊరుకాపు సంఘాలవారందరూ శత్రువుకు సోలెడు బియ్యమైనా దొరకకుండా చెయ్యాలి. శత్రువుయొక్క మాయమాటలకు మోసపోగూడదు. ఇదే మన కర్తవ్యం.

తూర్పువైపున రష్యాసేనలు అంతకంతకు జర్మను సేనలను వెనుకకు తరిమివేస్తూ ఉంటే, రెండోవైపున అనగా పడమటివైపున ఉన్న ఇంగ్లాండునుండి జర్మనీమీదకే విమాన దండయాత్రను సాగించవలెనని బ్రిటిషువారు సర్వ సన్నాహములు చేస్తున్నారు. త్వరలోనే యీ విమాన దండయాత్ర జర్మనీమీద సాగింపబడునని బ్రిటిష్ మంత్రియైన సర్ స్టాఫర్డు క్రిప్సుగారు సిన్నమొన్న ఒక అమెరికను పత్రికలో స్పష్టంగా వ్రాశారు. జర్మనీ మీదకు పడమటి వైపునుంచి ఒక దండయాత్రయున్నూ తూర్పువైపునుంచి రష్యనులు మరొక దండయాత్రను ఏకకాలమందే సాగిస్తారు. వైశాఖ మాసంనుండీ యీ సమష్టి దండయాత్ర చండప్రచండంగా సాగింపబడుతుంది. జర్మనీ సొగిలబడుతుంది. సాష్టాంగ ప్రణామం చేస్తుంది. అక్కడ రష్యా చేతులలో జర్మనికిన్నీ, ఇక్కడ చైనాలో జపానుకున్నూ అంత్యక్రియలు జరగాలి అట్లు జరిగినప్పుడు అంత్యవిజయం మిత్రమండలికి తప్పదు. ఈ మార్గమును నమ్మి పనిచెయ్యడమే మన కర్తవ్యం.

---

# తరువాత జపాను ఎటు కొడుతుంది?

## స్వదేశానికి 3,000 మైళ్లదూరంలో పోరుతున్నారు.

## చమురు చాలదు—సప్లైలు చాలవు—శక్తిచాలదు.

మలయ ద్వీపకల్పం, బోర్నియో, సెలిబీసు, న్యూగినీలందు జపానీయులు స్థావరమేర్పరచుకొనిరి. డచ్చి తూర్పుదీవుల ఉత్తరభాగాన నిలచి ఆగ్నేయంవైపు ఆస్ట్రేలియాపైని, పడమర ఇండియాపైని కన్నువేసేరు. కాని ముఖ్యంగా ఎటు దాడి సాగిస్తారో చెప్పుట కష్టంగావుంది.

మిత్రమండలి రక్షశిబిరాలందు వారి సైనికశక్తి కూడదీసుకొనకముందే వాటిని వశపరచుకోవాలని జపాను ప్రయత్నం. వరుసగనున్న ద్వీపాలనిరోధం దాటుటకై ముందుగ సుమాత్రా జవాలను వశపరచుకొని ముందుకిపోదామనుకుంటున్నారు.

అయితే వారికి ఆర్థికనిరోధాలు ఎక్కువవుతున్నాయి. వాటిని వారు తప్పించుకో లేకుండయున్నారు. అప్పుడే జపానుకి 3,000 మైళ్ల దూరంగా యుద్ధం చేయుచున్నారు. కేంద్ర స్థానములను పట్టుకొన్నందున సముద్రాధిపత్యం వహించి యిపుడింత దూరంలోకూడ యుద్ధం చేయగల్గుచున్నారు. కాని యీరీతిగ ఎంతకాలమో యుండదు.

అపుడే అమెరికా నౌకాదళము దూరంగా చెదరియున్న శత్రుస్థానాలపై దాడి ప్రారంభించింది. ఈ మహా పశిఫిక్కు సముద్ర మథనమునందు జపానుకి సప్లయిలు దొరకుట చిక్కుగానుండి చమురు, లోహము జపానుకి చాలపరిమితంగానుంది. ఇంకాదూరం పోవాలంటే అతివడిగా ఆపని ముగించాలి.

వాణిజ్య నౌకాబలంలో ప్రపంచంలోకెల్ల మూడోస్థానము నందున్న జపాను పెద్ద వాణిజ్యంగలదేశమే. మూడేండ్లు

**చమురు కావాలి.**

క్రిందట 2,300 నౌకలు (5,500,000 టన్నులు) ఉండెను. ఇపుడు యింకా ఎక్కువయుండవచ్చును. అయినా సరకును, శక్తిని చాలజాగ్రత్తగా వినియోగించుకోవాలి. నౌకలను సైనికులను సప్లయిలను ఎంతో మిగుల్చుకోక తప్పదు.

జపానుకి చమురు అధికంగా కావాలి. యుద్ధానికి పూర్వం, సాలీనా 37,000,000 బారల్సు చమురువాడేది. ఇందులో 30,000,000 అమెరికానుంచి, డచ్చి తూర్పుదీవులు, మెక్సికోలనుండి వచ్చేది.

కావున సైనికావసరముల కొరకేగాక, ఆర్థికావసరములను బట్టికూడ జపానువారు చమురు ఎక్కువగల డచ్చిదీవులపై దాడిపెడలిరి. అచట చమురేగాక, నౌకాశ్రయములు విమానాశ్రయములుగూడ ఎక్కువగ గలవు. తరువాత జావా, సుమాత్రాలపై జపాను దృష్టిసాగించెను.

ఆ తరువాత ఎక్కడికి అనే ప్రశ్న గలదు. పడమరకా, తూర్పునకా? ఆస్ట్రేలియాపైనా, ఇండియాపైనా? జపాను తనకు సప్లయిలు, విమాననౌకా దళాశ్రయాలు సంపాదించుటకేగాక, అవి మిత్రమండలికి లేకుండా చేయుటకుగూడ జపాను యుద్ధంచేయుచున్నది.

మలయాను ఆక్రమించుటచేత రబ్బరు, రేకు మిత్రమండలికి పోయినాయి. డచ్చి తూర్పు దీవులలో చమురుకూడా శత్రువశమయితే ఆస్ట్రేలియాకు గొప్ప దెబ్బ. బర్మానుండి రంగూనునకు, కలకత్తాకు, హిందూమహా సముద్రమునకు జపాను పడమరదాడి సాగించినచో మిత్రమండలికి చాల మోసంకలుగ గలదు.

హిందూ మహాసముద్రంలోకివస్తే ఇండియానుండి పోవుచున్న సైన్యాలను సరకులను జపాను నిరోధించగలదు.

**సప్లయిలు.**

జపాన్ను నిరోధించుచున్న చీనాను దిట్టపరచుట మిత్రమండలికి ఎంతో అవసరం. ఆ చీనాకు అమెరికా ఇంగ్లాండులనుండి పోతున్న సరకు మార్గమును రంగూనువద్ద జపానువారు నిరోధించగలరు.

హిట్లరుకి జపానుకి, సైన్యం సరకు నౌకలు చమురు అపరిమితంగాలేవు. ఉన్నదానిలోనే వారు సరిపెట్టుకోవాలి. 1942 వ సంవత్సరములోగా మనం పని ముగించుకోకపోతే ఇంగ్లాండు, అమెరికా బ్రిటిషు సామ్రాజ్యములలో తయారగుచున్న ఆయుధాలు, విమానాలు, మందుగుండు వచ్చి తమను ముంచేస్తాయని వారెరుంగుదురు.

ఈలోగా విశాలమగు పసిఫిక్ మహాసముద్రమునందు జపానువారు ఎంతవరకు విస్తరించగలరో చెప్ప వీలులేదు. మిత్రమండలి సరకు క్రొత్త సైన్యాలు యింకా దూరాన వుండబట్టి ఎంతదూరమైనా వారికిపుడు ఫరవాలేకుండాయుంది. కాని త్వరలో యీదూరం వారికి ప్రాణసంకటకరంగానుండగలదు. మిత్రమండలి తిరుగు దాడి ప్రారంభించిన పిమ్మట నాలుగైదు ఆరువేల మైళ్ల దూరంలో జపాను యుద్ధం చేయజాలదు.

---

# అమెరికా ఉత్పత్తి.

. నేడు 16 నిముసాలలో ఒక క్రూయిజరు, యుద్ధనౌక, రెండు డిస్ట్రాయరు నౌకలు ప్రథమప్రయాణం ప్రారంభించినవి, రెండు క్రొత్త నావలకు అస్తిభారం వేయబడినది. ఈ దేశంలో యింతవడిగా పరిశ్రమలయందుత్పత్తి, కార్మికశక్తి ప్రదర్శింపబడలేదు. ఈ డిస్ట్రాయరులు మొదటనుకున్న ప్రకారమయితే యింకా నాల్గునెలలు పోయినాక పూర్తికావలసినది, క్రూయిజరు యింకో ఆరు నెలలు గడిచేక రావలసింది అమెరికాకు రెండువైపులనున్న సముద్రాలందు రెండు ప్రత్యేక నౌకాదళములుంచుటకు, అతివడిగా పని సాగించుచుండుటచే, యీ మూడు నావలు అతివడిగా పూర్తియై నేడు బయలుదేరినవి.

—న్యూయార్కు టైమ్సు, ఫిబ్రవరి 13.

అపుడే మన సైన్యంలో 17,00,000 సైనికులున్నారు. ఈ సాలాంతంలోగా 36,00,000 నుండి 40,00,000 వరకు పెంచాలని ఉద్దేశించబడెను. విమానదళం 20,00,000 వరకు పెంచదలచిరి. జర్మను విమానదళంలో 12,50,000 బ్రిటిషు విమానదళంలో 10,00,000 సుమారుగ ఉందురు. నేలసైన్యం, విమానదళం యీరీతిగా పెంచి, 5,00,000 మంది రెండు సముద్రాల నౌకాదళంలోనుంటే, జపానుకి హడలుగానుండక మానదు, హిట్లరు, అమెరికాతో ఎందుకు పోరని విచారించక మానడు.

—న్యూయార్కు డెయిలీ న్యూసు, ఫిబ్రవరి 16.

బ్రిటను శక్తి.—బ్రిటను ఎంత బ్రహ్మాండమయిన కృషి చేసిందో చూడండి. ఫ్రాంసు, బెల్జియములు తమపక్షం వీడి పోయినాక ఒంటరిగా ఇటలీ జర్మనీలతో పోరు సాగించింది నార్వేకు తన సేననంపి దాడిచేసింది; అట్లే గ్రీసుకి, పంపింది. ఇరాకుకి సేనలనంపి అచట ద్రోహులు లేకుండా తుడిచివేసింది. రష్యాకు ప్రాణప్రదమగు రాధారిగల సిరియాలో చిన్న యుద్ధంచేసి గెలిచింది. ముసోలిని తూర్పు ఆఫ్రికా సైన్యాన్ని రూపులేకుండా చేసింది. లిబియాలో రెండుసారులు తిరుగుదాడులు చేసి గెలిచింది. జిబ్రాల్టరు, మాల్టాలను విడువలేదు. సూయజుకు దారి భద్రంగా నుంచగలిగింది. మధ్యధరా సముద్రం సూయజుకాల్వ మార్గములు, ఆఫ్రికాచుట్టు నౌకామార్గములు అమెరికా, కనడాలకుకూడ భద్రపరచుకుంది. ఆస్ట్రేలియా, ఇండియాలకు మార్గాలుకూడా కాపాడుకుంది. ఏ దేశమూ ఎన్నడు ఎరుంగని తీక్ష్ణ వినాశకరమగు బాంబులదాడికి గురియై నిలచింది, చావ మిగిలినవారు చేతులు బిగించి పళ్లు పటపట కొరుకుచు ఆకాశంపై క్రోధంగా చూస్తూ, "మేము ఎన్నటికీ పారిపోము" అంటున్నారు.

—విండికేటరునుండి, ఫిబ్రవరి 12.

---

# అమెరికా అధ్యక్షుని అభయం

అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వాధ్యక్షులగు రూజువెల్టుగారు జార్జి వాషింగటను జన్మదినోత్సవమునాడు రేడియో ఉపన్యాసము నొసంగుచు అమెరికా యుద్ధవ్యూహము గూర్చి వివరంగా తెలిపిరి. వివిధ ఖండములలో అమెరికనులు యుద్ధం సాగింతురనియు, బ్రిటను, చీనా, రష్యా మొదలగు మిత్రదేశాలకు యుద్ధ సామగ్రి పంపుచున్న సముద్రమార్గములను శత్రువు అరికట్టకుండ అమెరికా కాపాడగలదనియు యిదివరకు వాగ్దానంచేసినన్ని విమానాలు యితర యుద్ధ సామగ్రి తప్పక తయారుచేసి పంపెదమనియు ఆస్ట్రేలియాకు మార్గమును అమెరికా రక్షించగలదు గావున ఆస్ట్రేలియా భయపడ నవసరం లేదనియు తెలిపిరి.